సంలక్ష్యమాణవిష్ణుపదతారకా సముదయోత్ప్రేక్షావహంబులు రాజమార్గంబులు పార్శ్వద్వయమున ఖాత పత్రఫలశలాటూప లక్షిత కదళీవృక్ష సమంచిత క్రముకస్తంభబంధుర కాయమానలలిత; జల యంత్ర వికీర్యమాణ శీతల జలకణ జాలసంసిక్తా నవరత యాతాయాత తురగ ఖురక్షుణ్ణ పరాగంబులు ప్రతిద్వారంబులు నవరత్న స్యూత చిత్రి తోరణ విరాజితంబులు, నైనేత్ర పర్వంబుగ నలరారు నయోధ్యా పురమతల్లిని గనుచు బౌరులకు దనయందుగల భక్తికి యానందించుచు రాజభవనంబుజేరి యంతఃపుర ప్రవేశం బొనర్చె. పురజనులును రాజ పత్నులును శాంతను తత్ప్రియునిగాంచి, యమందానంద కందళిత హృదయారవిందులైరి. పెద్దలందరును దశరథుని ప్రయత్నంబు సఫలం బగునని దమ మనంబుల నిచ్చయించిరి.

వ. అంత,

క॥ చూతములు పూచి కాచెను
వాతంబులు వీచె పుష్ప వాసనయుక్తిన్
భీతిని బొందిరి పాంథులు
జేతమునంతో సమంద చెలగె వనాళుల్॥ ౧౬౧

గీ॥ చిగురుటాకుల మెక్కుచు చిత్రముగను
కోకిలంబులుగూసెను "కోో" యటంచు
బంభరంబులు పూదేనె భవ్యగతిని
యారగించుచునా నందమందుచుండె॥ ౧౬౨

వ. అట్లు వసంతర్తువు సమీపించుటతోడనె దశరథ మహారాజు ఋష్యశృంగు నవలోకించి యిక జాగుచేయక నశ్వమేధ యాగం బాచరింప సంకల్పము చేయించవలెనని కోరెను.

చ॥ పరగ మునీంద్రుడా పలుకు భావమునందున నిల్పి సత్కృపన్
వరతురగంబు వేవిడువు వస్తువులెల్లను సంగ్రహింపు మీ
యరమర లేదు బుత్రులిక నద్భుత పేర్ములు బుట్టివంశము
స్సరగున వృద్ధిజేయుమరు సత్యము బూనెద యాజకత్వమున్॥ ౧౬౩

చ॥ అనవిని సంతసించి నృపు డాదరమొప్ప సుమంత్రు జూచి యా
ఘనుని యరుంధతీ విభుని గర్వ విదూరుల ఋత్విగాదులన్
వినయముతోడ నీవె చని విన్నపమొప్పగ జేసి వేగమే
మనమున సంతసం బొదవ మాన్యుల దెమ్మిటకంచు బల్కినన్॥

వ. అతడు సత్వరంబుగ జని,

గీ॥ వామదేవుని కాశ్యపు వరగుణాఢ్యు
నలవశిష్టుని జాబాలి నఖిల విదుని
భూమి సురులను సుయజ్ఞు భూపుకడకు
దెచ్చె నాతడు సద్భక్తి దేటపడగ॥ ౧౬౫

వ. అట్లు జనుదెంచిన దశరథుడు,

చ॥ అతి దృఢభక్తి నామునుల నర్చలొనర్చి మహానుభావులా
మతికుశలుండు రాఘవుడు మాన్యుల కిట్లని బల్కెనింపుగా
సతతము మిమ్ము గొల్చినను సంతతిగల్గ దిదేమి చిత్రమో
సుతులనుగూర్చు సత్క్రతువు సుష్టుగ జేయ ననుగ్రహింపుడీ॥

క॥ సంతానము గలుగమికిని
సంతాపము నొందు నన్ను సంరక్షింపన్
సంతాన మిచ్చు క్రతువును
శాంతావిభుతోడ మీరు జరుపగవలయున్॥ ౧౬౭

(7)

క॥ హయమేధము జేయింపుడు
దయ దనయులు గలుగు దాన దప్పదు సుండీ
నయ విదులు మీరు గావున
భయమును దొలగించి గావ భక్తిని గొలుతున్॥ ౧౬౮

చ॥ అనవిని విప్రులందరప్పు డంచిత లీలనరుంధతీ విభుం
గనుగొన, ఋష్యశృంగముని గాంచి వశిష్ఠుడు సంప్రతించియో
మనుకులవార్ధిసోమ విను మాన్య విభండకసూను సత్కృపన్
తనయులు నీకుగల్గుదురు, తథ్యము వీడుము వేగమేయయున్॥ ౧౬౯

క॥ సంతతి కలుగగ వలెనని
సంతత సద్భావకలన సాధుల గొలువన్
సంతతి గలుగక యుండునె
సంతోషము నొందవయ్య సంతతి గలుగున్॥ ౧౭౦

క॥ నలుగురు తనయుల బొందుము
పలుబలుకులు బలుకనేల భాస్కరవంశ్యా
కలుషములు దొలగిపోయెను
కలుగును భద్రంబులెల్ల గాంక్షలుదీరన్॥ ౧౭౧

క॥ అని పలికిన మునిపలుకులు
విని హర్షమునొందె విభుడు వేడుకతోడన్
దనయులు గలిగినవిధమున
దనమనమున దలచిపొంగె ధన్యుడననుచున్॥ ౧౭౨

క॥ చిత్రాపూర్ణిమ యందున
సత్రార్థముజేసి రాజు సాంగ్రహణేష్టిన్
పుత్రావాప్తికి విడిచెను
సత్రాణము యయువుసర్వ సాధనయుక్తిన్॥ ౧౭౩

గీ॥ సకల వస్తువులెల్లను సంగ్రహింప
దగినవారల నియమించె ధరణివిభుడు
కార్యకరులైరి మంత్రులు కార్యవిదులు
విప్రులాతని దీవించి వేగజనిరి॥ ౧౨౪

వ. అశ్వమేధ యాగార్హంబగు తురంగమము మహాసేనా సమన్వితులగు పెక్కండ్రు భువనవిఖ్యాతులగు మహారథికులచే రక్షితంబగుచు స్వేచ్ఛావిహారంబు సల్పుచుండె. విశ్వంభరయందుగలరాజవరు లందరు దమ హృదయంబు లసూయా కలుషితంబులై యున్నను దశరథుని దాడికి నిలువజాలమను భీతిని యశ్వరాజంబు చెంతకొకరైన యేతెంచినవారుగారు సర్వంసహా నంతయు స్వేచ్ఛగ తిరిగి తిరిగి. యయోధ్యానగరమున కేతెంచుచుండ పునర్వసంతము సమీపించు చుండె నంత,

చ॥ అనఘుడు రాజశేఖరుడు హర్ష వివర్ధిత కార్యవేగుడై
వినయముతో వశిష్ఠముని వేడ్కగనుంగొని భక్తియుక్తుడై
ఘనుడవు నీవు నన్గరుణగావగ యజ్ఞధురంబు బూనుమీ
ఘనమగు వాంఛితంబులను గాంచగ చిత్తమున న్దలంపుమీ॥ ౧౨౫

క॥ తాతల తాతల నుండియు
నేతగులము లేక మమ్ము నేలితివయ్యా
యీతరమున నను గావని
హేతువు వచియింపవయ్య హిమవద్ధైర్యా॥ ౧౨౬

క॥ హితుడవు గురుడవు పూజ్యుడ
వతి నిపుణుడ వన్ని పనుల నద్భుత తేజో
యుతుడవు బుత్రావాప్తికి
క్రతుభారము బూని నన్ను గావుము గరుణన్॥ ౧౨౭

వ. అని పలుకు దశరథుని వాక్యములవిని నవ్వుచు వశిష్ఠుడు "రాజేంద్రా, నీవేమియు సంశయింపకుము. నేనిక నీవు చేయబూనిన యశ్వమేధ యాగ భారమునంతయు బూనెదను. నీకేకోదువయు గలుగ నియ్యను. నీవు నిశ్చింతుడవై యుండు" మని బలికి శిల్పులను చిత్రకారులను వర్ధకులను గణకులను స్థపతులను ఖనకులను గాంచి వారి వారికి తగిన పనులు బోధించి సత్వరంబున సరయూత్తర కూలమున యజ్ఞశాలలను పాక గృహంబులు వలయునన్ని నిర్మింపుడు. స్త్రీలు, పురుషులు, బాలురు, విప్రులు, రాజవరులు తదితరులును నివసించదగిన గృహంబు లనేకంబులు దృఢంబులు వాసయోగ్యము లగునట్లు గట్టుడని యాజ్ఞాపించి తదనుకూల సంవిధానంబు లన్నియు వారికి బోధించి వలయు వస్తువులన్నియు తదర్హగృహంబులను నుపను సకల కృత్యంబుల నెరవేర్చను తగినవారిని నియమించి యధికృతుల నవలోకించి,

గీ॥ విప్రవరు లెందరెందరో పీటిపట్లు
నుండువారలు రాగల రూర్చితముగ
వారు కోరిన వస్తుల వరసతోడ
నిచ్చి తృప్తిని బొందింపు డింపుతోడ॥ ౧౨౫

వ. ఏ వర్ణమువారు విచ్చేసినను వారి వర్ణమునకు తగిన నివాసములు సత్కారములు జరుపవలయును. శాస్త్రవిధుల నావంతయు నతిక్రమించ జనము. ఎవరికిని లేశమాత్రమైన నవమానించతగదు.

గీ॥ లేని కార్యంబు దీర్పంగ రేయి బగలు
కష్ట మెటులైన భరియించ గడగవలయు
సవితృవంశంబు సంతాన స క్తమగుచు
జగము బాలింప జేయగాజాలవలయు॥ ౧౨౬

వ. అని బలికిన వశిష్ఠమహర్షి వాక్యంబుల విని వారు వినయ భయభక్తి శ్రద్ధలు గలవారలై తమకు నియమితములైన పనులన్నియు నిర్వహించిరి యరుంధతీ ప్రాణనాధుడు సుమంత్రు నవలోకించి నీవు సత్వరంబుగ భూలోకంబున గల విశిష్ట బ్రాహ్మణులను రాజవరులను పూజ్యులగు నందరను యజ్ఞ సందర్శనార్థము బిలిపించుము మఱియు,

క॥ మిథిలా నాధుడు శూరుడు
విధియుక్తముగాగ వేద వేదాంగములం
బుధులెల్ల మెచ్చ నెరుగును
విధిగానీ వేగియతని వేడెమ్మటకన్॥ ౧౮౦

గీ॥ పూర్వసంబంధి యతడౌట పూజ్యతముడు
యాజ్ఞవల్క్యుని శిష్యుడు యజ్ఞవిదుడు
సర్వశాస్త్రార్థవిజ్ఞుడు సర్వసముడు
సత్యవిక్రమ యుక్తుడు సత్వయుతుడు॥ ౧౮౧

వ. మఱియు,

గీ॥ రాజసింహుని మిత్రుడు రాజవరుడు
హితము దెలియును కాశీశుడిద్ధ కీర్తి
యతని గొనితెమ్ము నీవేగి యాదరముగ
నతడు విజ్ఞుడు పరమార్థ చురయువాడు॥ ౧౮౨

చ॥ మనుకుల రాజశేఖరుని మామను కేకయపార్థివేశ్వరు
న్ఘనముగ జంతు భాషలను కమ్రిపురీతి నెరుంగువానిని
న్ఘనుని సపుత్రుదెచ్చుటకు గట్టిగనీవట కేగు వేగమే
యనఘుడు వృద్ధుడార్యనుతు డాఢ్యుడు బంధువరుండు గావునన్॥

గీ॥ వినయవంతుని విశ్వాసి వేదవిదుని
సకల శాస్త్రార్థవిజ్ఞాను సత్యవాక్యు
బాహుబలమున విఖ్యాతి బడయువాని
రోమపాదుని బిలువుము ప్రౌఢిగాను॥ ౧౮౪

క॥ కోసలదేశము నేలెటి
భూసుర పరిపాలనైక భూషితచిత్తున్
వాసిగ గొని తెమ్మిచటికి
భాసురుడగు భానుమంతు భాస్వద్వంశ్యున్॥ ౧౮౫

గీ॥ మగధనాథుని బిలువుము మాన్యుడతడు
దాతలందున ముఖ్యుడు ధన్యతముడు
క్రతువులెన్నియొ చేసెను క్రమముగాను
సత్కృతుల జేయదగువాడు సత్త్వమూర్తి॥ ౧౮౬

సీ॥ సౌరాష్ట్రనాథుల సౌభాగ్యయుక్తుల
తూర్పును బాలించు దొరలనెల్ల
సౌవీరవిభులను సౌజన్యయుక్తుల
ధనధాన్యసంయుక్తి దనరువారి
దక్షిణంబేలెడి దాక్షిణ్యయుక్తుల
సింధుదేశము నేలు శీలయుతుల
సంతల పొంతల నందర బంధుల
పరివారయుక్తుల పరిచితులను

గీ॥ వీరు వారననేల నీవిశ్వమందు
బిలువదగువారి నందర బిలువబంపు
మఘముజూతురు మఘుపుని మఘమునట్లు
సత్కరింతము వారల సర్వగతుల॥ ౧౮౭

క॥ ఎక్కువ తక్కువ లెంచక
మక్కువతో నెందరైన మన్ననతోడన్
చక్కెర ఫలముల మెసవుచు
నొక్క కుటుంబజుల బోల నుంచుము శక్తిన్॥ ౧౮౯

చ॥ అన విని మంత్రి తద్విధిని నంతయు గూర్చి గురూక్తి చొప్పునన్
వినయముతోడ విన్నపము విజ్ఞుడు చేయగ నాలకించి యా
మునియును యజ్ఞవాటికకు మోదముతోడుత బోయిచూచి యా
పనులును వస్తు సంతతులు భవ్యము లౌటను గాంచె మోదమున్॥

క॥ కర్మాంతి కుల గనుగొని
కర్మంబుల నెల్ల బూర్తిగావించుటచే
శర్మంబుల నొందుదు రిక
భర్మంబుల బొందగలరు బహుభంగులుగన్॥ ౧౯౦

వ. అని బలికి సుమంతు నవలోకించి

చ॥ అరమర లేమ దివ్యమును లద్భుత తేజులు రాజపుంగవుల్
కరమను రక్తి భూసురులు కావ్యపిముండెడి సర్వమానవుల్
వరగుణులెందరో యిటకు వచ్చుచు నుండిరి గాన వారలన్
సరసముగాగ సత్కృతుల సర్వవిధంబుల జేయు మింపుగన్॥ ౧౯౧

క॥ అవమాన మించుకేనియు
నవరులలోనైన గాని యమరక యుండన్
సవరణగాగ సపర్యల
వివరముగా జేయవలయు వినయము తోడన్॥ ౧౯౨

క॥ అవమతియేరికి గలిగిన
నవమానము మనకు గలుగు నపవాదముచే
నవనీశుడొందు కీడు ల
నవహేళన మంది క్రతువు హర్షము దొలచున్॥ ౧౯3

క॥ అని బలుకు చుండ నంతట
ఘనులగు ధాత్రీశు లెల్ల గడు వేగముగా
గనుగొనువారల కెల్లను
మన మలర నయోధ్య జేర మంత్రియు వేగన్॥ ౧౯౪

గీ॥ తగిన విడులు జూపించి ధరణిధవుల
క్రమముగాగని సన్మాన గరిమజరిపి
వారలర్పించు కానుకల్వారిన గొనుచు
నందరిని వాని సంతోషమంద జేసె॥ ౧౯౫

క॥ రేయింబవళులు రాజులు
హాయిగ జనువెంచుచుండ హర్షముతోడన్
పాయక బూజలదనుపుచు
నాయతనములందునిల్పి యలరగజేసెన్ ౧౯౬

వ. అంత మానవరాజులు మునిరాజులు ద్విజరాజులు సకల మానవులు తమతమ విడుదుల సుఖముగ నివసించియుండ సర్వజ్ఞుడగు వశిష్టమహర్షి రఘువంశశేఖరుండగు దశరథు నవలోకించి,

చ॥ సకల రసాధి నాథులు భవన్మహితాజ్ఞ శిరంబులందునన్
వికసితపుష్పమాలికల వేడ్కధరించిన రీతిదాల్చుచున్
సకలసువర్ణసంతతుల జక్కని తేజుల వారణాళులన్
ప్రకట సువర్ణజాలయుత భర్మఘటంబుల వస్త్రభూషలన్॥ ౧౯౭

గీ॥ గొనుచు భూలోక దేవేంద్రు గొలువనిన్ను
భక్తి నేతెంచియున్నారు భవ్యులెల్ల
వారినందరి బూజించి వసతులెల్ల
నేర్పరించితి మెచ్చిరి యేకరీతి॥ ౧౯౮

క॥ యజ్ఞీయములను గూర్చిరి
యజ్ఞాయతనంబులందు యజ్వులుబాగన్
యజ్ఞము సంకల్పించుము
యజ్ఞాయతనంబు నీకు యాతవ్యమికన్॥ ౧౯౯

గీ॥ అనువశిష్టముని విభండ కాత్మజాతు
వాక్య సుధగ్రోలి యానంద వార్ధిమునిగి
స్వస్తివాదన ముఖరుల సర్వవిదుల
విప్రముఖ్యులతోఁగూడి వేడ్క వెడలి॥ ౨౦౦

క॥ శుభదివసతార లందున
శుభవాద్యము లెల్ల మ్రోగ శోభాన్వితుడై
శుభవస్తు వితతి దోడ్కొని
విభవాధికుడైన రాజు వెడలెను వేగన్॥ ౨౦౧

చ॥ అటజని కాంచె భూమివిభు డంబరచుంబి గృహోత్తమంబులన్
పటుతర సర్వవస్తువులా భావుకమానస కల్పితంబులో
దిటముగ యోగజాతములొ దివ్యములో యన నొప్పువాటినిన్
పటుతరయోగ నిష్ఠులను భవ్యుల విప్రుల బ్రహ్మవేత్తలన్॥ ౨౦౨

చ॥ సవనముదీర్ప సద్విధిని సద్ద్విజముఖ్యులు ఋశ్యశృంగునిన్
శివము వశిష్ట సంయమిని శీఘ్రము ముందర నిల్పి ధీరులై
యవసరమైన వస్తుతతులన్నియు జేర్చి సుఖోపవిష్టులై
యవిరళ మంత్రజాలముల నవ్యయలీల నొనర్చి రందరున్ ౨౦౩

వ. అప్పుడు,

సీ॥ సకలదేశంబుల సంచారమొనరించు
హయమును బట్టెడి యతడె లేడు

స్వేచ్ఛగ దిరుగుచు స్వేచ్ఛగ దినుచును
క్రమముగ సాకేతగామియయ్యె
తిరుగవసంతంబు తీరుగ నేతెంచ
రక్షకులెల్లరు రమ్యముగను
హయముతోఁ జేరిరి హాయిగాగను వేగ
రథకారగృహమున రాటగట్టి

గీ॥ రశ్వవరమును బ్రహ్మాదులమిత నియతి
దానిపదముల నాల్గింట ధర్మమెఱిఁగి
హోమమునుజేసి రారాత్రి హోతలెల్ల
శాస్త్రములనెల్ల నెఱిగిన శాంతమతులు॥ ౨౦౪

వ. పిమ్మట బ్రహ్మయగు ఋష్యశృంగుడు మొదలగు నలుగురు ఋత్విక్కులు హయమేధాశ్వమును యాగశాల యందశ్వస్థ వ్రజమున బంధించిరి. వేదపారగులు వేదమును మీమాంసను కల్పసూత్రముల ననుసరించి యథాయోగ్యములగు వైశ్వదేవాదికము నాచరించిరి. పిదప ప్రవర్గ్య బ్రాహ్మణోక్త ప్రవర్గ్యమును, నిష్టి విశేషమగు, నుపసదమును సాంప్రదాయ సిద్ధములగు నధికకర్మలను జేసిరి. ప్రాతస్సవన మాధ్యందిన సవన తృతీయసవనముల నాచరించిరి. ఐంద్రమింద్రునికొరకు నివ్వబడినది. సోమరాజు స్తోత్రశస్త్రములచే స్తుతిచేయబడెను. సర్వ హోమాదికములు, మంత్రయుక్తములు, క్షేమయుక్తములు, నిర్విఘ్నములై ఒప్పినవి.

చ॥ స్ఖలితములేక హోమమును సద్విధిజేసిరి సర్వతంత్రముల్
వెలసెను మంత్రయుక్తముగ వేడబ మేమియు లేదువిఘ్నము
ల్గలగవు సర్వమానవులు గాంచిరి తృప్తిని భోజనాళిలోఁ
నలయికడప్పి యాకలియు నందినవాడటలేడు కోటిలోన్ ౨౦౫

ఉ॥ అందరు సర్వవేదవిదులందరు వందల మీరు శిష్యులం
బొందుగ నేలివిద్యలను బూర్ణముగాగను నేర్పువారలే
యందరు సర్వయజ్ఞముల నద్భుత తత్వ మెరుంగువారలే
యందరు బ్రహ్మతత్వవిదు లందరు యోగవిదగ్రగణ్యులే॥ ౨౦౬

ఉ॥ కూరలు సన్నయన్నములు కోరిన భక్ష్యము లాజ్యసూపముల్
సారెకు పచ్చడు ల్దధియు జక్కగ పంక్తుల వెంటవడ్డనల్
పారులు జేయుచుండగను బారులు దీర్చి యనేక కోటుల
వ్వారిగ సర్వమానవులు వారని ప్రేమ భుజించి రొప్పుగన్॥ ౨౦౭

క॥ ఆదశరథ యజ్ఞంబున
వేదంబులు రానివాడు వెదకిన యొకడున్
మోదముతోడుత గాంచగ
నాదట లేడయ్యె యధికులచ్చటి విప్రుల్॥ ౨౦౮

ఉ॥ వీరలు వారలంచనుచు వేరుగ జెప్పగ నేల యందరుం
జేరల గార నాజ్యములు జెప్పగ శక్యము గాని భక్ష్యముల్
వారని యన్నపానములు వల్చిన పప్పులు లేహ్యచోష్యము
లుబ్బారిగ ముక్కుబంటిగను బొజ్జల నింపిరి తేన్చిరందరున్॥ ౨౦౯

క॥ పాచకులు నూతనంబగు
యోచనచే మునుల మిగులు యోగముచేతన్
ధీచతురత సమకూర్చిరి
యీ చతురత్వంబు గలదె యెచ్చట జగతిన్॥ ౨౧౦

గీ॥ వలదు సూపంబు దుగ్ధంబు వలదు దధియు
వలదు ఖాద్యంబు భక్ష్యంబు వలదు ఘృతము
పొట్టబరువెక్కె దినలేము పూర్ణతృప్తి
నందినారము చాలు మాకన్న మికను॥ ౨౧౧

గీ॥ ఎట్లు జేసిరో పాకంబు లెవని కెఱుక
యెన్నడెరుగని రుచి చేత నేపుమిగిలె
దినుచు దినలేక విడలేక దేన్చి దేన్చి
లొట్ట లిడుచుండిరందరు లోలులగుచు॥ ౨౧౨

గీ॥ ఆశ మిక్కిలి యధికమై యలవరింప
విస్తరాకుల విడలేక వివిధజనులు
బహువిధాన్నము పానము బరమ ప్రీతి
గనుల భక్షించుచుండిరి కాంక్షచేత॥ ౨౧౩

క॥ నలపాక మొకటి భూమిని
వలతులచే జెప్పబడును వరమని మిగులన్
నలపాక రుచిని మించిన
యల రుచి గల దిందటంచు ననిరి యభిజ్ఞుల్ ౨౧౪

క॥ కుడువంగ లేక విస్తరి
విడువంగా లేక రుచికి వేడుక బడియా
యడియాస వదలనేరక
నడియాడెడి మనసుతోడ నరులుండిరటన్॥ ౨౧౫

క॥ నానాదేశాగతులగు
మానవతీ మనుజ తతులు మధు రుచిరములౌ
పానాన్నంబుల మెక్కుచు
నానాగతి జేసినారు నవ్య స్తుతులన్॥ ౨౧౬

శా॥ భద్రంబ్భక్తి జనాళి కల్పకతరో భాస్వత్ప్రతాప ప్రభో
ఛిద్రంబించుక లేక నీ క్రతువు వే శ్రీదంబ శీఘ్రంబయా
భద్రానందము నొందినారము మహాభవ్యుండ వీవెప్పుడున్
మాద్రిన్మీరితివయ్య సర్వవిధుల న్మాన్యర్షులం గొల్చుటన్॥ ౨౧౭

గీ॥ ఎట్లు జేసిరో పాకంబు లెవని కెఱుక
యెన్నడెఱుగని రుచి చేత నేపుమిగిలె
దినుచు దినలేక విడలేక దేన్చిదేన్చి
లొట్ట లిడుచుండిరందరు లోలులగుచు॥ ౨౧౨

గీ॥ ఆశ మిక్కిలి యధికమై యలవరింప
విస్తరాకుల విడలేక వివిధజనులు
బహువిధాన్నము పానము బరమ ప్రీతి
గనుల భక్షించుచుండిరి కాంక్షచేత॥ ౨౧౩

క॥ నలపాక మొకటి భూమిని
వలతులచే జెప్పబడును వరమని మిగులన్
నలపాక రుచిని మించిన
యల రుచి గల దిందటంచు ననిరి యభిజ్ఞుల్ ౨౧౪

క॥ కుడువంగ లేక విస్తరి
విడువంగా లేక రుచికి వేడుక బడియాం
యడియాస వదలనేరక
నడియాడెడి మనసుతోడ నరులుండిరటన్॥ ౨౧౫

క॥ నానాదేశాగతులగు
మానవతీ మనుజ తతులు మధు రుచిరములౌ
పానాన్నంబుల మెక్కుచు
నానాగతి జేసినారు నవ్య స్తుతులన్॥ ౨౧౬

శా॥ భద్రంబక్షి జనాళి కల్పకతరో భాస్వత్ప్రతాప ప్రభో
ఛిద్రంబించుక లేక నీ క్రతువువే శ్రీదంబ శీఘ్రంబయా
భద్రానందము నొందినారము మహాభవ్యుండ వీవెప్పుడున్
మాద్రిన్మీరితివయ్య సర్వవిధుల న్మాస్వర్షులం గొల్చుటన్॥ ౨౧౭

గారవేదియందుపధానంబు జేసిన యది స్వర్ణగర్భంబై స్వర్ణపక్షంబై యధో
దృష్టిగలదై ప్రాఙ్ముఖంబై యష్టాదశ ప్రస్తారాత్మకమై ప్రసారితపక్ష
పుచ్ఛములుగల గరుడాకృతిగలిగి యొప్పుచుండె. పూర్వోక్తయూపంబు
లందు యింద్రాది దేవతలనుద్దేశించి గ్రామ్యపశువితతి బంధించిరి.
ఆరోకములయందు సూకర పన్నగ పతత్రిప్రముఖారణ్య జంతువుల
నిలిపి బంధించిరి. ఇందశక్యములగు సర్పాదులు పంజరముల బంధించ
బడినవి. ఇందు పర్యగ్నికృతములైన యారణ్యకముల విసర్జించిరి.
యూపముల బంధితములగు గ్రామ్యములు, త్రిశతములు, అవి శా
మిత్రకర్మోపయుక్తములు. అశ్వమేధమున పశుసంఖ్య పంచశతైకోన
వింశతి, అశ్వరత్నము నియతమైయున్నయది. అప్పుడు శామిత్రస్థానమున
యాగీయ హయరత్నమును కూర్మాది జలచరంబులను గ్రామ్య పశు
జాతమును విశసనార్థమాయత్తపరిచిరి యూపనిబద్ధములగు మున్నూరు
ప్రధాన పశువులను సర్వరత్నవిభూషితమగు హయరత్నమును విశసించిరి.
కౌసల్యాది రాజపత్నులు వావాత పరివృత్తిమహిషులు, శామిత్రస్థాన
మున మృతినిబొందిన హయముచెంతకేతెంచి సవ్యాపసవ్యంబుగ వేదోక్త
క్రమంబున పరిచరించి నిరవధిక శ్రద్ధచేత సౌవర్ణములగు సూదుల
మూటిచేత నశ్వమున కసిపథంబులు కల్పించిరి. అంత మహాపతి
వ్రతాతిలకమగు కౌసల్య ధర్మసిద్ధిపడయ మృతతురగ శరీర స్వర్శకు
జుగుప్సాయత్తచిత్తగాక నయ్యశ్వంబుతోడ నొకరాత్రినివసించె. యప్పుడు
తత్కాల దక్షిణకుగాను దశరథునివలన మహిషిని బ్రహ్మయు వావా
తనుహోతయు పరివృత్తి నుద్గాతయు పాలాకలిని యధ్వర్యుడు
క్రమంబున పరిగ్రహించి భర్తయుంబోలె హస్తగ్రహణంబొనర్చిరి.
దశరథునివలన ప్రతినిధి ద్రవ్యంబుగొని వారల గ్రమ్మరనాభూపాల
తిలకున కొసంగిరి. అంత నధ్వర్యుడు హయవపనాకర్షించి నియమిత

సర్వేంద్రియుఁడై యగ్నియందు శ్రీపణంబుగావించి వేదోక్తవిధుల హోమమును జేసినవాఁడయ్యెను.

గీ॥ ధర్మములనెల్ల నెఱిగిన దశరథేంద్రుఁ
డొప్పుచున్నట్టి యవ్వపా హోమధూమ
గంధ మాఘ్రాణ మొనరించి కలుషవితతి
యంతయునుబోవ మిగుల కృతార్థుఁడయ్యె॥ ౨౨౦

గీ॥ పదియాఱ్వురు ఋత్విజు ల్పదిలముగను
వాజియంగంబులన్నియు వహ్నియందు
పచన మొనరించి వేల్చిరి పరమనియతి
యగ్నియందున తచ్ఛేషమర్థిఁ కిడిరి॥ ౨౨౧

గీ॥ అన్యపశువుల వపవేల్చ నగ్నియందు
ప్లక్షశాఖను పెట్టుట బరమనియతి
అశ్వమేథాశ్వ వపవేల్చ యగ్నియందు
వైతసకటంబు గ్రాహ్యంబు వైదుకముగ॥ ౨౨౨

వ. నాశ్వస్యవపా విద్యతే అను సూత్రమువలన నశ్వమునకు వపయుండదు. వపాస్థానీయ్యమను తేజినియనగా చంద్రాఖ్యమేదస్సు వపాస్థానమున గ్రహింతురు. అశ్వమేధము బహుదినసాధ్యమై నందు ప్రధానదినములు మూఁడు. చతుష్టోమాత్మకంబగు జ్యోతిష్టోమంబు ప్రథమాహము, ఉక్థ్యంబు ద్వితీయాహము; అతిరాత్రము తృతీయాహము. ఇట్లశ్వమేధము సంపూర్తిగావించి శాస్త్రాంతర దర్శనమువలన విహితములయిన యితరయజ్ఞములను అశ్వమేధాంగభూతములు జ్యోతిష్టోమా యురతిరాత్రి ద్వయాప్తోర్యామాభిజిద్విశ్వజిత్తులను నారు యజ్ఞములను గావించె. నంత దశరథరాజేంద్రుఁడు యాగదక్షిణల నివ్వదలపెట్టె.

సీ॥ ప్రాగ్దిక్కు హోతకు బ్రహ్మకు యామ్యంబు
పశ్చిమ మధ్వర్యు పాదునకును
నుత్తరముద్గాత కుత్తమకీర్తిని
ధరణి యంతయునిచ్చె ధరణివిభుడు
తాపసులప్పుడు ధరణినాథునిగాంచి
వనవాసులము మాకు వసుధ యేల
క్రియముకు నీకిద్దె ఖాయపర్చితిమయ్య
కొనవయ్య వేగమే కోర్కెలిచ్చి
గీ॥ యావులోక కొన్ని బంగారమదియు కొంత
రత్నములుకొన్ని దయచేసి రాజరాజ
నీవెయేలుము భూమిని నియతముగను
సత్యధర్మానువర్తివై శాశ్వతముగ॥ ౨౨౩
ఉ॥ కోరినకోర్కె లిచ్చుటయె కోటిగుణంబులు విప్రకోటికిన్
పారులుభూమినేలుదురె పార్థివలోకము భూమిలోకమున్
సారస మిత్రవంశభవ చారువిలాసముతోడ నేలుమీ
వారని ప్రేమ నీసుతులు వావిరినేలుదురయ్య నీవలెన్॥ ౨౨౪
మ॥ ఒల్లముభూమి నేలుటకు నొల్లముపొట్టకు మించుభాగ్యముల్
పొల్లులు బల్కువారలమె పోషణజేసెద వీవెమమ్మలన్
కొల్లగ సొమ్ములేల నిమకొంత సువర్ణము కొన్ని రత్నముల్
మొల్లములైన గోవులను మోదము నొందెదమయ్య భూవరా॥
మ॥ అను చిట్లాడిన విప్రవాక్యముల కల్లొగాక యంచానృపుం
డనువా గోవులగోటిసంఖ్య శతకోట్యుత్యుత్తమ స్వర్ణముల్
ఘనరూప్యంబులు నాల్గురెట్లిడగ కార్యజ్ఞులౌ ఋత్విజుల్
గొనియర్పింప గురుండు బ్రహ్మయును చేకొంచప్పుడే వారికిన్॥ ౨౨౬

గీ॥ భాగముల బంచి శాస్త్రోక్త భవ్యరీతి
నెవరిభాగంబు వారికి నివ్వగానె
వారుమిక్కిలి తృప్తులై వరుసతోడ
ననిరి "తృప్తాస్మ" యనరాజు హర్ష మొందె॥ ౨౨౭

మ॥ క్రమవీక్షా పరతంత్రులైన ప్రజలన్గారుణ్య మేపారగా
నతిమూల్యోత్తమ వస్త్రసంఘముల సర్వాభీష్ట దానంబులన్
మితిలేనట్టి సువర్ణ రూప్యముల నెమ్మిన్గంకణౌఘంబులన్
ప్రతిలేనట్టి ప్రశస్తసన్మణుల సంభావించె రాజందరన్॥ ౨౨౮

మ॥ ఘనదానంబుల నెల్ల వారలను సత్కారంబులన్జేయుచున్
వినయం బొప్పగ జేరి భక్తివశుడై విశ్వాస పూర్వంబుగా
ననువొప్పంగ వినమ్రుడై నిలువగా నార్యుల్కృపాదృష్టిచే
గనుమీ భద్రములంచు బల్కిరి నృపున్గాఢాను రక్తాత్ములై॥ ౨౨౯

వ. మరియును,

గీ॥ అభిమతార్థము సిద్ధించు నఖిలనాథ
రాజశేఖర రాఘవ రాజరాజ
యనుచు విప్రులు దీవించ నవనివిభుడు
వారి కర్పించె దండంబు వరుసతోడ॥ ౨౩౦

వ. అంత దశరథ మేదినీకాంతుండు విభాండకసూనునిం గనుంగొని వశిష్ఠానుమతంబున నిట్లనియె,

చ॥ మిహిరుడు మాకులపూరుషుడు మిత్రుడు మాకు నరుంధతీశ్వరుం
డహితుడులేడు లోకమున నధ్వరమిట్టుల దీర్చినారుగా
విహితమువంశవర్ధనము విజ్ఞులు మీరలు వేడుచుండితిన్
రహిగరుణాకటాక్షమున రాఘవ వంశము నిల్పు బూనుడీ॥

చ॥ అరువది వేల వత్సరము లద్భుత వేగము తోడ బోయె నా
కరయగ నాత్మ జాతు డొకడైనను గల్గ డిదేమి చిత్రమో
పరమ దయాంతరంగ! యికభవ్య కటాక్షముతోడ సూనులన్
స్థిరముగ గూర్చు మార్గమును తీరుగ ద్రొక్కి యనుగ్రహింపవే॥

గీ॥ మనుదిలీప రఘువులను మదిని దలచి
నాదు వృత్తంబు దలచక నవ్వమగుట
వారి వంశంబు నిలుపుము వరద! నీవు
మదిని దలచిన వన్నియు మహిని గలుగు॥ ౨౩౩

క॥ కులవర్ధనులగు సూనుల
గలిగింపగ నీవె కాక గలరే యితరుల్
లలి నన్ను ధన్యు జేయగ
దలపుము నీవనిన మునియు తద్దయు బలికెన్॥ ౨౩౪

క॥ కులవర్ధనులగు బుత్రులు
నలుగురు గలుగుదురు నీకు నరనుత వినుమా
నలిపెద నిష్టిని వేగమె
గలకాలము చింతలేక గడపెద వింకన్॥ ౨౩౫

క॥ కలదొక యిష్టియు వినుమిా
వలనొప్పగ జేయ దాన వరసుతచయమున్
గలుగును గావున నిప్పుడె
సలుపంగావలయు దాని చతురత యనినన్॥ ౨౩౬

కం॥ మునివాక్యము విని మోదము
గనిభక్తిని గురునితోడ గడువడి బలికెన్
మనమున దీనిని దలచుము
తనయుల దయసేయ నీవు త్వరపడవలయున్॥ ౨౩౭

క॥ మీరిరువురు యీభారము
ధీరతబూనంగవలయు ధీయుతులారా
కారణ మెఱిగినవారలు
వేరుగనిట్లుండనేల వేబూనుడికన్॥ ౨౩౮

చ॥ అనవిని వారలిద్దరపు డాదరమొప్ప నధర్వణంబు నం
దునగల మంత్రతంత్రముల దూర్ణమ యిష్టిని జేయుచుండగా
నినకులు యజ్ఞభాగముల కింపుగజేరిన దేవతావరుల్
ఘనుని సరోజజాతుగని గ్రక్కునజేరి వచించిరొప్పుగన్॥ ౨౩౯

చ॥ వరములగోర లేదనవు వారిజసంభవ దానరావణుం
డరమరలేకనిర్జరుల నందరగెల్చి సమస్తబాధలం
బరపుచు నున్నవాడు భయభావనచే శరణంబు వేడగా
కరమనురక్తిచేరితిమి గావగదే శరణార్థులన్మమున్॥ ౨౪౦

ఉ॥ పారులజంపినాడు పరభామల మిక్కిలిబొందినాడు గా
కూరుడు ధర్మదూరుడును గోవుల సాధుల గూలదన్ను వా
డారని చిచ్చుమాకత డనార్యుడు నీదయనిట్లునుండెదాన్
కారణమేమిలేక గడుగారియబెట్టెను సర్వభంగులన్॥ ౨౪౧

ఉ॥ వానికి నింద్రుడోడెనిక వహ్ని గతింబరికింపనేల నా
భానుసుతుండుబారె బసిబాలుని భంగిని డాగదైత్యుడు
న్మానినియయ్యెపాశి మతిమంతుడు వాయువు మందగించె నీ
దీనునిగాంచుమీ ధనదుదీవ్రత శంకరునాశ్రయించెబో॥ ౨౪౨

సీ॥ తపనుడతనిపజ్జ తగినట్లునడచును
గాలివిసరబోడు గంధవహుడు
పారిజాతంబుల భయమున బుచ్చుచు
శక్రుడు సేవల జరుపుచుండు

సురవరులందరు సురటీలు వేయుదు
రమర మునులతని నాశ్రయింతు
శేలోకమందైన నెదురించగలవాని
గనులజూడగలేదు గమలనాభ

గీ॥ వాని బరిమార్చుమార్గంబు వలుకవేమి
పరులమా? మేమునీపదభక్తియుతుల
మేలగావవు! మము నిట్టులేల నేచ
సాధజనబాధజూచుట సంతసంబె॥ ౨౮౩

క॥ రావణు డెవ్వనిచేతను
చావగ నున్నాడో వాని సరగున చెప్పుమా
గావగ లోకుల నెంచుము
తావక వరదాన మహిమ దలపగ వశమా॥ ౨౮౪

సీ॥ నిర్జరులిటువేడ నీరజ జాతుడు
దేవతా తతితోడ తేటగాను
వరముగోరెడు వేళ కరమనురక్తిని
గంధర్వదైతేయ గరుడ యక్ష
దానవరాక్షస దైత్యేంద్రుల వలన
మరణంబు లేకుండ మమ్ముగోరె
నరుల వానరులను పరగగోరగలేదు
నరవానరులచేత నాశమొందు

గీ॥ పరులు జంపగ లేరని బలుకగానె
యమరులందరు సంతోషమంది మిగుల
మునులతోగూడి మంతనములను జేసి
రక్షకాపేక్షులై యుండ రభసముగను॥ ౨౮౫

వ. శ్రియఃపతే సర్వేశ్వర సర్వస్వతంత్ర సర్వాంతర్యామిన్ సర్గస్థితి సంహారకారణాఖిలహేయప్రత్యనీకకళ్యాణ గుణమహోదధే ఆది మధ్యాంతరహిత శ్రీవైకుంఠనికేతన శ్రీవత్సలాంఛనధర శ్రీభూనీళా పరిచరితపాదయుగళ సర్వవ్యాపిన్ సర్వనియామక భక్తావనదీక్షిత భక్త సులభ భక్తపరతంత్ర భక్తాభీష్టప్రద ఖలవనదావదహన దానవాంతక నమస్తే నమస్తే శతకృత్వస్సహస్రకృత్వః॥

సుగంధి॥ మమ్ముఁగావు దేవదేవ మానసేశ వేగమే
తెమ్ముఁపాదయుగ్మ మీశ తేటగాగ గొల్వగా
నమ్ముఁమీ దయానిధే ఘనార్తిచే సుభీతిచే
మిమ్ముఁ జేరగావవేమి మేలుగూర్పు సత్కృపన్॥ ౨౫౦

క॥ రావణుడు వరమదంబున
దానవయూథంబుతోడ దశదిగ్వనితా
భావము దూలగజేసెను
తావకజని చేతవాని దగగూల్పుమికన్॥ ౨౫౧

చ॥ శరణనివేడువారలకు సర్వశుభంబులగూర్చు దీక్షచే
వరలెదవంచు వేదములె బల్కుట తెల్లముగాన నెప్పుడున్
కరములుమోడ్చి నీచరణకంజయుగంబుల నాత్మగొల్చుమా
కరయగరావణాసురుడు కష్టపరిస్థితిగూర్చె గావవే॥ ౨౫౨

ఉ॥ ఊహయొనర్పడో యతిశయోక్తులకెక్కడ నడ్డులేక నో
సాహసమిట్లుజేయుచును సాధులనేచగ దుష్టరాక్షస
వ్యూహమువృద్ధిజేయుటకు వ్యగ్రక్రమదుష్ట వరంబులిచ్చి య
వ్యాహతిచేత నీసుతుడు వ్యక్తమునీకృప నిట్లుజేసెడిన్॥ ౨౫౩

గీ॥ ముక్కుమూసినమాత్రాన మూర్ఖులైన
వారికిచ్చును వరములు వనజభవుడు

మూడుజగములు దుఃఖాబ్ధిముఁనిఁగిపోవు
దిద్దుబాటును జేయంగ దిక్కు నీవు॥ ౨౫౪

గీ॥ గొప్పవానికిగలిగిన కొడుకుగాన
దాసులందరగాచుట ధర్మమగును
యిట్టిదుష్టులచే మమ్ము నేచదగునె
గావుమిప్పుడే కమలాక్ష గరుణతోడ॥ ౨౫౫

సీ॥ మునులెప్పు డడవిలో ముక్కు మూయగరాదు
దేవత లెక్కడ దిరుగరాదు
యక్షులెక్కడనైన నక్షుల బడరాదు
తెరగంటి వనితలే తేరరాదు
గంధర్వగానంబు కర్ణంబు సోకరాదు
నందనం బరానదు నత విధేయ
సురలు హావిస్సుల సొరగూడ దెప్పుడు
వజ్రియెక్కడి కేగ వలనుపడదు

గీ॥ యేమి జెప్పుదుమో యయ్య! యిట్టి కష్ట
నష్టములతోడ నీకీర్తి నవయుచున్న
మమ్ము గావంగ దలచుము మనసునందు
నీవె పరగతి మాకెల్ల నిత్య విభవ॥ ౨౫౬

క॥ అరి మర్దన మొనరింపగ
పరమాత్ముడవైన నీవె పరమాప్తుడవై
నరవేషధారివగు మీక
శరణార్థుల మమ్ము గావ శతధృతి జనకా॥ ౨౫౭

చ॥ అడజడిబల్కె ధాత వరమర్థికి నిచ్చితి మందబుద్ధినై
పుడమిని నాకలోకమును పూర్ణముగాగను బుగ్గిసేయగా

గడగెను వాని ద్రుంచుటకు కాశ్యపి బుట్టె కకుత్థ్సవంశమున్
కడువడిగావ గావలెను కంజదళాక్ష! కరంబు మోడ్చెదన్॥ ౨౫౮

ఉ॥ ఓనలినాక్ష! నన్గరుణ నోమగ నెంచెద వేని వేగమే
మానవ జన్మ మెత్తి మటుమాయలమారిని రావణాసురున్
సూనులతోడ ద్రుంచి రవిసూనుని లోకము జూడ బంపుమీ
భానుకులంబు నీజనికి భాజనమై తగియుండె నీతరిన్॥ ౨౫౯

చ॥ అనవిని శంకరుండనియె నచ్యుత విన్నప మాలకించు మీ
ఘనుడితడిష్టి నీకరుణ గాంచ సుతాళిని బొందజేసె నీ
వనితర లభ్యమా జనని యద్భుత మీతని భార్యలందునన్
గనగ ననుగ్రహింపు మిక కాంచనచేల జగంబు గావగన్॥ ౨౬౦

చ॥ మునులు వినమ్రులై హరికి మూర్ఖులు దైత్యులు మమ్ముసర్వదా
ఘనమగురీతి బాధలను కాననమందున బెట్టిరార్పటి
న్మనమున శంకలేక సుసమాధి నివిష్టుల గూల్చి రుగ్రులై
యనయము యజ్ఞవిఘ్నముల నజ్ఞత జేసిరి వాని గూల్పవే॥ ౨౬౧

గీ॥ తార్క్ష్యవాహన దశరథ తరుణులందు
సుతుడవై బుట్టి రావణు సుతులతోడ
వేగకడ తేర్చవలయును వేదవేద్య
మాకు శరణంబ వగుమయ్య మాన్యచరిత॥ ౨౬౨

చ॥ అనవిని సర్వరక్షకుడు హర్షముతో సుత పద్మజాదులక్
గనుగొని భీతినొందకుడు కాశ్యపిబుట్టుదు మానవాకృతిం
దనుజుల రావణాసురుని తత్సుతుల న్దది ముట్టగూల్చెదం
మనమున శంకవీడుడిక మంచిగగల్గుసుఖంబు మీకికన్॥ ౨౬౩

గీ॥ అభయమిచ్చితి భయమేల నమరులార
సకల శుభములబొందుచు స్వర్గమందు

గడగెను వాని ద్రుంచుటకు కాశ్యపి బుట్టి కకుత్థ్సవంశమున్
కడువడిగావ గావలెను కంజదళాక్ష! కరంబు మోడ్చెదన్॥ ౨౫౮

ఉ॥ ఓనలినాక్ష! నన్గరుణ నోమగ నెంచెద వేని వేగమే
మానవ జన్మ మెత్తి మటుమాయలమారిని రావణాసురున్
సూనులతోడ ద్రుంచి రవిసూనుని లోకము జూడ బంపుమీ
భానుకులంబు నీజనికి భాజనమై తగియుండె నీతరిన్॥ ౨౫౯

చ॥ అనవిని శంకరుండనియె నచ్యుత విన్నప మాలకించు మీ
ఘనుడితడిష్టి నీకరుణ గాంచ సుతాళిని బొందజేసె నీ
వనితర లభ్యమా జనిని యద్భుత మీతని భార్యలందునన్
గనగ ననుగ్రహింపు మిక కాంచనచేల జగంబు గావగన్॥ ౨౬౦

చ॥ మునులు వినమ్రులై హరికి మూర్ఖులు దైత్యులు మమ్ముసర్వదా
ఘనమగురీతి బాధలను కాననమందున బెట్టిరార్బటి
న్మమున శంకలేక సుసమాధి నివిష్టుల గూల్చి రుగ్రులై
యనయము యజ్ఞవిఘ్నముల నజ్ఞత జేసిరి వాని గూల్పవే॥ ౨౬౧

గీ॥ తార్క్ష్యవాహన దశరథ తరుణులందు
సుతుడవై బుట్టి రావణు సుతులతోడ
వేగకడ తేర్చవలయును వేదవేద్య
మాకు శరణంబ వగుమయ్య మాన్యచరిత॥ ౨౬౨

చ॥ అనవిని సర్వరక్షకుడు హర్షముతోడుత పద్మజాదులన్
గనుగొని భీతినొందకుడు కాశ్యపిబుట్టుదు మానవాకృతిం
దనుజుల రావణాసురుని తత్సుతుల న్దది ముట్టగూల్చెదం
మనమున శంకవీడుడిక మంచిగగల్గుసుఖంబు మీకికన్॥ ౨౬౩

గీ॥ అభయమిచ్చితి భయమేల నమరులార
సకల శుభములబొందుచు స్వర్గమందు

ఉ॥ తేకువ పెక్కువర్షములు తీవ్రతపంబొనరించి పద్మజుం
లోకువజేసి లోకములలోలత బాధలపెట్టి మమ్ము న
ట్టాకలబెట్టె దుష్టుడగు రావణుడెంతటి క్రూరచిత్తుడో
వీక దయారసంబునను వేగమ మానవరూపుదాల్పవే॥ ౧౨౦

సుగంధి॥ భూమినంతయునేలువాఁడు భూభుజుండు వేడుకన్
కామితంబునొందగా బ్రకామమిష్టినిజేసెబో
సామగానలోల! వేగ సత్సుతాప్తిమూలమై
భామలందు నీవుబుట్టి భారమంతయు దీర్పవే॥ ౧౨౧

వ. అని సుపర్వాణులు విన్నవించిన సర్వజ్ఞుండగు శ్రీమన్నారాయణుడు వసుమతియందు మానవరూపంబున నవతరించుటకు నిశ్చయించుకొని,

గీ॥ సంతతిఁగోరి యర్చించుసత్వగుణుని
దశరథాహ్వయు ధర్మజ్ఞు తండ్రిగాగ
దనమనంబున దలచెను దశరథుండు
సర్వమెరిగిన సంపూర్ణశక్తుడగుట॥ ౧౨౨

వ. అపుడు నారాయణుండు విబుధవరుల నవలోకించి మీరు వచించిన వాక్యంబుల తత్వమెఱింగితిని. యిక మీయభీష్టంబు ఫలించును. మీకు మేలుగలుగును. నేను దశరథునకు పుత్రచతుష్టయరూపంబున నవతరించి సపరివారుండగు రావణునిబరిమార్చి లోకులకమందానందంబు సంపాదించెదనని యభయదానంబొసగి ధాతృముఖదేవబృంద వంద్యమానపదద్వయుడై యంతర్ధానంబుజేసె. బృందారకులందరు దమ తమ భాగముల బరితృప్తులై రావణునివలన దమకుభయమిక గలుగబోదని భావించి సంతసించిరి.

ఉ॥ తేకువ పెక్కువర్షములు తీవ్రతపంబొనరించి పద్మజుం
లోకువజేసి లోకము లలోలత బాధలపెట్టి మమ్మున
త్తాకలబెట్టె దుష్టుడగు రావణుడెంతటి క్రూరచిత్తుడో
వీక దయారసంబునను వేగమ మానవరూపుదాల్చవే॥ ౨౭౦

సుగంధి॥ భూమినంతయునేలువాడు భూభుజుండు వేడుకన్
కామితంబునొందగా బ్రకామమిష్టిని జేసెబో
సామగానలోల! వేగ సత్సుతాప్తిమూలమై
భామలందు నీవుబుట్టి భారమంతయు దీర్పవే॥ ౨౭౧

వ. అని సుపర్వాణులు విన్నవించిన సర్వజ్ఞుండగు శ్రీమన్నారాయణుడు వసుమతియందు మానవరూపంబున నవతరించుటకు నిశ్చయించుకొని,

గీ॥ సంతతిగోరి యర్చించుసత్వగుణుని
దశరథాహ్వయు ధర్మజ్ఞు తండ్రిగాగ
దనమనంబున దలచెను దశరథుండు
సర్వమెరిగిన సంపూర్ణ శక్తుడగుట॥ ౨౭౨

వ. అపుడు నారాయణుండు విబుధవరుల నవలోకించి మీరు వచించిన వాక్యంబుల తత్వమెఱింగితిని. యిక మీయభీష్టంబు ఫలించును. మీకు మేలుగలుగును. నేను దశరథునకు పుత్రచతుష్టయరూపంబున నవతరించి సపరివారుండగు రావణునిబరిమార్చి లోకులకమందానందంబు సంపాదించెదనని యభయదానంబొసగి ధాతృముఖ దేవబృంద వంద్యమానపదద్వయుడై యంతర్ధానంబుజేసె. బృందారకులందరు దమ తమ భాగముల బరితృప్తులై రావణునివలన దమకుభయమిక గలుగబోదని భావించి సంతసించిరి.

వ. అని బలికిన విని దశరథుండు వినయంబున కరములమోడ్చి సంతుష్టాంతరంగుడై,

చ॥ అనఘుడు భక్తిమ్రొక్కులిడి యద్భుత హర్షములొక్కరీతిగా
మనమున దొంగలింపగను మన్ననజేయుచు బల్కెనేనికన్
వినయముతోడ జేయదగు విస్తృతకార్యము జెప్పవేయనన్
ఘనమిది దివ్యపాయసము గ్రక్కున దీని పరిగ్రహింపుమీ॥ ౨౭౭

చ॥ ఎసగిన భక్తిచేకొనుము హేమఘటంబున నున్న దీని నీ
కొసగగ దెచ్చితిన్శుభము నూర్జిత భాగ్యము సత్సుతోదయం
బసమ మనామయంబు నతి హర్షము గల్గును ప్రేయసీ సతీ
విసరము భక్తిమై మెసగ వేగమ నిమ్మిక గోర్కె దీరెడిన్॥ ౨౭౮

వ. ఓ మహారాజా! ధశరథరాజ! భవత్కృతమగు నీ యిష్టికి దేవేంద్రాది సర్వదేవతలును సంతసించి నిన్నుకరుణించి యీ కాంచన పాయస పాత్రను నీకు బంపిరి. ఈ పాయసము పుత్రీయము, సర్వ సంపత్ప్రదము, శుభదము, గాన సత్వరముగ దీనిని గొని చని నీ పడతుల కొసగుము. నీ పత్నులు భక్తిని దీనిని భుజించి సత్పుత్రవతులగుదురు. పొమ్మని బలికి యా పాత్రను దశరథుని కొసగి యా భూతము దన పదమున కేగెను. అప్పుడు దశరథుడు

క॥ కడుపేదకు నిధి యబ్బిన
వడువున సంతోష మందె వర నృపు డంతన్
వడి దన కాంతల చెంతకు
కడు ముదమున నతడు వోవ కాంతలు మిగులన్॥ ౨౭౯

వ. తమ సన్నిధానముకు దయచేసిన భానుకులావతంసంబగు దశరథమహారాజును వీక్షించి భయభక్తుల బ్రణమిల్లి దమ కాంతుని

వ. అని పలికిన విని దశరథుండు వినయంబున కరములమోడ్చి సంతుష్టాంతరంగుడై,

చ॥ అనఘుడు భక్తిమ్రొక్కులిడి యద్భుత హర్షములొక్కరీతిగా
మనమున దొంగలించగను మన్ననజేయుచు బల్కెనేనికన్
వినయముతోడ జేయదగు విస్తృతకార్యము జెప్పవేయనన్
ఘనమిది దివ్యపాయసము గ్రక్కున దీని పరిగ్రహింపుమీ॥ ౨౭

చ॥ ఎసగిన భక్తిచేకొనుము హేమఘటంబున నున్న దీని నీ
కొసగగ దెచ్చితిన్నృపమ నూర్జిత భాగ్యము సత్సుతోదయం
బసమ మనామయంబు నతి హర్షము గల్గును ప్రేయసీ సతీ
విసరము భక్తిమై మెసగ వేగమ నిమ్మిక గోర్కె దీరెడిన్॥ ౨౮

వ. ఓ మహారాజా! దశరథరాజ! భవత్కృతమగు నీ యిష్టికి దేవేంద్రాది సర్వదేవతలును సంతసించి నిన్నుకరుణించి యీ కాంచన పాయస పాత్రను నీకు పంపిరి. ఈ పాయసము పుత్రీయము, సర్వ సంపత్ప్రదము, శుభదము, గాన సత్వరముగ దీనిని గొని చని నీ పడతుల కొసగుము. నీ పత్నులు భక్తిని దీనిని భుజించి సత్పుత్రవతులగుదురు. పొమ్మని పలికి యా పాత్రను దశరథుని కొసగి యా భూతము దన పదమున కేగెను. అప్పుడు దశరథుడు

క॥ కడుపేదకు నిధి యబ్బిన
వడువున సంతోష మందె వర నృపు డంతన్
వడి దన కాంతల చెంతకు
కడు ముదమున నతడు పోవ కాంతలు మిగులన్॥ ౨౯

వ. తమ సన్నిధానముకు దయచేసిన భానుకులావతంసంబగు దశరథమహారాజును వీక్షించి భయభక్తుల ప్రణమిల్లి దమ కాంతుని

ఉ॥ కాంతలు పాయసంబు నిజకాంతుడు జూడ భుజించిరంత దు
ర్దాంత కృకీటయోని హరిదశ్వని కాశరుచి ప్రదీప్తముల్
శాంతసురాంగనా హృదయ సంతతతాప నిపీడనంబులా
శాంతసుకీర్తనీయ గుణతాంత సుగర్భములైన గర్భముల్॥ ౨౮౫

చ॥ సలలితగర్భభారయుత సాధ్వులగాంచి నితాంతహృష్టుడై
జలరుహ మిత్రవంశజుడు శక్రసమానుడయోధ్యనుండె నా
బలరిపుడు న్శచీయుతుడు భాసురనాకమునందు దేవతా
బలములు సిద్ధసాధ్య ముఖభవ్యులు గొల్వగ నుండురీతిగన్॥ ౨౮౬

గీ॥ దశరథుండప్డు క్షణమైన దారతతిని
విడువకుండగ సేవించె విమల యశుడు
రాజుదారల విడువక రక్తిదవిలి
నిత్యసేవల జేయుట నియతిగాదె॥ ౨౮౭

వ. మరియు రాజదారలు నాయాధ గర్భలై యభూత పూర్వ శోభా విశేషంబున ప్రకాశించుచుండిరి,

గీ॥ దేవహితమునుగోరుచు దైత్యహారుడు
రాజపత్నుల యందున రమ్యముగను
తనదు తేజంబు నిలుపుచు ధరణీధవుని
నమిత సంతోష పాథోధి యందు ముంచె॥ ౨౮౮

వ. అంత పద్మనాభుడు భూలోకమున దుష్ట సంహారమునకును సాధు సంరక్షణకును, సూర్యవంశంబున నవతరించుట బరికించి పరమానందభరంబున,

గీ॥ అమరులను గాంచి బలికె నాయబ్జభవుడు
భూమి భారంబు దీర్పగ పుడమియందు
శ్రీశుడుదయించె భక్తిని సేవజేయ
బుత్రులను గాంచుడిక మీరు పుడమియందు॥ ౨౮౯

ఉ॥ కాంతలు పాయసంబు నిజకాంతుడు జూడ భుజించిరంత దు
ర్దాంత కృకీటయోని హరిదశ్వని కాశరుచి ప్రదీప్తముల్
శాంతసురాంగనా హృదయ సంతతతాప నిపీడనంబులా
శాంతసుకీర్తనీయ గుణతాంత సుగర్భములైన గర్భముల్॥ ౨౮౫

చ॥ సలలితగర్భభారయుత సాధ్వులగాంచి నితాంతహృష్టుడై
జలరుహమిత్రవంశజుడు శక్రసమాను డయోధ్యనుండె నా
బలరిపుడు న్శచీయుతుడు భాసురనాకమునందు దేవతా
బలములు సిద్ధసాధ్య ముఖభవ్యులు గొల్వగ నుండురీతిగన్॥ ౨౮౬

గీ॥ దశరథుండప్డు క్షణమైన దారతతిని
విడువకుండగ సేవించె విమల యశుడు
రాజుదారల విడువక రక్తిదవిలి
నిత్యసేవల జేయుట నియతిగాదె॥ ౨౮౭

వ. మఱియు రాజదారలు నాయూఢ గర్భలై యభూత పూర్వ శోభా విశేషంబున ప్రకాశించుచుండిరి,

గీ॥ దేవహితమునుగోరుచు దైత్యహరుడు
రాజపత్నుల యందున రమ్యముగను
తనదు తేజంబు నిలుపుచు ధరణీధవుని
నమిత సంతోష పాథోధి యందు ముంచె॥ ౨౮౮

వ. అంత పద్మనాభుడు భూలోకమున దుష్ట సంహారమునకును సాధు సంరక్షణకును, సూర్యవంశంబున నవతరించుట బరికించి పరమానందభరంబున,

గీ॥ అమరులను గాంచి బలికె నాయబ్జభవుడు
భూమి భారంబు దీర్పగ పుడమియందు
శ్రీశుడుదయించె భక్తిని సేవజేయ
బుత్రులను గాంచుడిక మీరు పుడమియందు॥ ౨౮౯

గీ॥ గోళ్లు శిలలును ద్రుమములు కోరలరయ
నాయుధంబులు గాగల్గి యస్త్రశస్త్ర
మర్మమెల్లను దెలియుచు మహితులగుచు
కామరూపులు శాస్త్రార్థ కలితమతులు॥ ౧౯౮

సీ॥ కొండల పిండిగ గొట్టంగ నేర్తురు
తరుషండముల గూల్చ దగినవారు
సాగరములరొంపి సలుపగ దగుదురు
మింటికెగసి సూర్యుమింగగలరు
చుక్కలదాకను శూరత నెగురుచు
మేఘపంక్తులబట్టి మెలుపగలరు
ప్రాగద్రిపైనుండి పశ్చిమోత్తరాద్రి
లంఘింపగలిగిన లలితజవులు

గీ॥ నిఖిలజగముల నొకసారి నియమగతిని
సంచరించగ జాలిన సత్త్వయుతులు
శూరులందర దోకలజుట్టికట్టి
విడిచిపెట్టంగ గలిగిన వీర్యయుతులు॥ ౧౯౯

మత్తకోకిల॥ అట్టివానర వీరులందున నాఢ్యులుత్తమ వీర్యులుం
యెట్టిశూరులనైన నేర్పున నేపణంచగ శక్తులుం
పట్టభద్రుల వాక్యశౌర్యులు భానుపుత్రప్రసన్నుల్
దిట్టలై కపిసేననెల్లను దిద్దిరుత్తమ పద్ధతిన్॥ ౨౦౦

గీ॥ శక్రపుత్రుని వాలిని శమితరిపుని
సూర్యపుత్రుని సుగ్రీవు శూరవీరు
నన్నదమ్ముల గొలిచిరి హరులుముఖ్యుల
నీలు హనుమంతు నలనాము నిపుణమతులు॥ ౨౦౧

గీ॥ రాజులందరు సత్కార రాజినంది
గురునిచరణంబు లర్చించి గూర్మితోడ
సంతసించుచు దమతమ సచివ సహితు
లగుచు నేగిరి పురములనమల గతిని ౩౦౮

గీ॥ రాజులేగిన పిమ్మట రాజరాజు
విప్రపుంగవ యుక్తుడై క్షిప్రముగను
దనయయోధ్యకు జేరెను దారయుతుడు
ధర్మపథమున నడిచెడి దశరథుండు॥ ౩౦౯

గీ॥ ఋష్యశృంగుడు జనియెను ఋషులతోడ
శాంతయును రోమపాదుడు చక్కనడువ
సకల పరివారములు తోడ సాగిరాగ
రాఘవార్చితుడై జనె రమ్య సరణి॥ ౩౧౦

క॥ సుత సంప్రాప్తిని గోరుచు
మతిమంతుడు దశరథుండు మానితపతియై
యతి సంతోషము తోడుత
సతతము సుఖసక్తి నచట జక్కగ నుండెన్॥ ౩౧౧

ఉ॥ కన్నులు చల్లగాను గసిగందుల నెన్నడు గాంచువాడ యిం
కెన్నడు గోర్కె దీరునని యెంచుచు నువ్విళులూరుచుండగా
గ్రన్నన రాజపత్నులకు గర్భపు చిహ్నము లొప్పె వింతగా
మన్ను దినంగబూనిరి సముంచిత వాంఛలు హెచ్చెహెచ్చుగాన్॥

గీ॥ అంత వేవిళ్ళు గలిగె నాయబలలకును
చూచుకంబులు నలుపయ్యె చూచుచుండ
మేనుజిక్కెను నడుమెంతో మేటియయ్యె
కనుల నెరుపెక్కె రతివాంఛ గలుగకుండె॥ ౩౧౩

గీ॥ రాజులందరు సత్కార రాజినంది
గురునిచరణంబు లర్చించి గూర్మితోడ
సంతసించుచు దమతమ సచివ సహితు
లగుచు నేగిరి పురములనవుల గతిని ౩౦౮

గీ॥ రాజులేగిన పిమ్మట రాజరాజు
విప్రపుంగవ యుక్తుడై క్షిప్రముగను
జనయయోధ్యకు జేరెను దారయుతుడు
ధర్మపథమున నడిచెడి దశరథుండు॥ ౩౦౯

గీ॥ ఋష్యశృంగుడు జనియెను ఋషులతోడ
శాంతయును రోమపాదుడు చక్కి నడువ
సకల పరివారములు తోడ సాగిరాగ
రాఘవార్చితుడై జనె రమ్య సరణి॥ ౩౧౦

కం॥ సుత సంప్రాప్తిని గోరుచు
మతిమంతుడు దశరథుండు మానితమతియై
యతి సంతోషము తోడుత
సతతము సుఖసక్తి నచట జక్కగ నుండెన్॥ ౩౧౧

ఉ॥ కన్నులు చల్లగాను గసిగందుల నెన్నడు గాంచువాడ యిం
కెన్నడు గోర్కె దీరునని యెంచుచు నువ్విళులూరుచుండగా
క్రన్నన రాజపత్నులకు గర్భపు చిహ్నము లొప్పె వింతగా
మన్న దినంగబూనిరి సమంచిత వాంఛలు హెచ్చెహెచ్చుగాన్॥

గీ॥ అంత వేవిళ్ళు గలిగె నాయబలలకును
చూచుకంబులు నలుపయ్యె చూచుచుండ
మేనుజిక్కెను నడుమెంతొ మేటియయ్యె
కనుల నెరుపెక్కె రతివాంఛ గలుగకుండె॥ ౩౧౩

గీ॥ కార్తికవ శుక్లచంద్రుని గతిని వారి
ముఖము తెలుపెక్కె గనుగొన ముదముగొలిపె
చనుల కార్శ్య మలరెను జడత హెచ్చె
నాభి వికసించె మాంద్యంబు నడల గలిగె॥ ౩౧౪

గీ॥ వళులు విరియంగబారెను నలతయలరె
నల్లనయ్యెను నూగారునవ్యకాంతి
కలలు మంచివికలిగెను కాంతలకును
మనసుమిక్కిలి యానంద మహితమయ్యె॥ ౩౧౫

క॥ వటపత్రంబును బోలిన
కుటిలాలక గర్భమిపుడు గురుభరయుతమై
వటపత్రమె యనబరగెను
వటపత్రమునందు బాలువాడుండుటచే॥ ౩౧౬

గీ॥ కమలబాహుల బంధంబు గనినవాని
భక్తహృదయ బంధంబు బడయువాని
భామలప్పుడు దమగర్భ భవనమందు
బంధమొందింప బడసిరి భాగ్యవశత॥ ౩౧౭

గీ॥ పుష్పగంధులు వెలసిరిపూర్ణగర్భ
భరితలై రమ్యకాంతిని భామలిపుడు
కలువపూజేసి కడుపున నలరదాల్చి
మెఱయుప్రాచీది శాంగన మెఱపుదెగడి॥ ౩౧౮

క॥ నెలలు పదిరెండు జరిగిన
నలసటలుం గలిగెమిగుల నల వనితలకున్
విలసిల్లె కళలుమిక్కిలి
యలవడె సీల్గాడునట్టియహములు మిగులన్॥ ౩౧౯

## శ్రీరామావతార ఘట్టము.

క॥ క్రతుపూర్తి యైనపిమ్మట
గతమయ్యెను ఋతువు లారుగనుగొను చుండన్
హితమగు పదిరెండవనెల
నతి నొందెడి చైత్రశుక్ల నవమిసవేళన్   ౩౨౦

గీ॥ అదితిభమునందు మధ్యాహ్నమైన తరిని
పంచఖగములు తమ యుచ్చభములనుండ
కర్కటాభిఖ్యరాశిని కమలవైరి
దేవగురువరుతో గూడి తేజరిలగ॥   ౩౨౧

క॥ సాయనమగు గ్రహ సంపద
శ్రేయముగా నుచ్చభముల వెలుగుచు నుండన్
బాయక రమ యురమున గల
మాయాజిత సర్వలోక మహితుడు బుట్టెన్॥   ౩౨౨

గీ॥ జగదధీశుని సర్వేశు చక్రహస్తు
సర్వలక్షణ సంయుక్తు చారువక్త్రు
దశరథానంద కందుని దైత్యహరుని
యచ్యుతార్ధాంశమగు వాని యమరవర్యు॥   ౩౨౩

గీ॥ అమిత తేజోభిరాముడై యలరు వాని
గన్న కౌసల్య విలసిల్లె కాంతి మిగిలి
యమరవరుడైన శక్రుని యార్యవినుతు
వజ్రపాణిని గన్నట్టి వనిత వలెను॥   ౩౨౪

క॥ సకల జగత్పద్మంబులు
వికసింపగ జేయ నెంచి విష్ణ్వాదిత్యుం
డకలంక కోసలాధిప
సకలార్ధ సుతానుపూర్వ సంధ్యను బొడమెన్॥   ౩౨౫

గీ॥ సకల సద్గుణ ఖనినైక యమలగుణుని
కమల నయనుని సుముఖుని కాంతియుక్తు
జనమనోహరు లావణ్య సహిత దేహు
దీర్ఘబాహుని గనియెను ధీరు వీరు॥ ౩౨౬

గీ॥ అలసుమిత్ర గనియెను హర్ష యుతుల
యమళులను సర్వరిపు కులయముల ఘనుల
గనుల కానంద మొనరించు కాంతియుతుల
చారు లక్షణ యుక్తుల చంద్ర ముఖుల॥ ౩౨౭

సీ॥ మొలక నవ్వులతోడ వలరాజు వగతోడ
నలరాజు నవకంబు జెలువుతోడ
నరచందురుని బోలి యిరవొంది పసమించు
కమనీయ సత్వాల కలనతోడ
నల తమ్మిరేకుల కలకలనవ్వించు
గరువంబుగల సోగ కనులతోడ
తిల పుష్పమునుదిద్దగల తీరు గలిగిన
మురిపెంపు సిగల ముక్కుతోడ

గీ॥ గనుల కానంద మొదవించు కాంతితోడ
కలవ దొరసిగ్గు నిరసించు కలలతోడ
మెరయు పుత్రుని కౌసల్య మెఱుగుబోడి
గనియె ప్రాక్సతిచంద్రుని గనిన యటుల॥ ౩౨౮

సీ॥ సకలదిక్కులు సుప్రసన్నములయ్యెను
గంధర్వ గానంబుగలిగె దివిని
చలువనెత్తావుల సంచరించెనుగాలి
కుసువర్షంబులు గురిసెమింట

సురదుంధుభుల మ్రోతశుభకేల వినిపించె
జయ జయయని దేవసంఘమనియె
బరగ త్రేతాగ్నులు ప్రజ్వరిల్లుచునుండె
సాధులు సంతోషసక్తులైరి

గీ॥ కష్టచరితులు కష్టసంకలితులైరి
వానజక్కగగురిసెను వసుధబండె
మనుజులెల్లరు సంతోషమగ్నులైరి
బాలుపుత్రుని కౌసల్య భామగనగ॥ ౩౨౯

గీ॥ పురముమిక్కిలి శోభిల్లె భూసురకు
భూమిగోధన వస్త్రాదిభవ్య భూసురాళి
సరసచాతుర్య వాక్పర్య సాధుచర్య
సంస్తవాంచిత మూసందనస్తమగుచు॥ ౩౩౦

గీ॥ ధరణిగలవారి నందరినగెనరితి
ధనముచేతను దనిపెను దశరథుండు
వీరువారను భేదంబువిడచి ధర్మ
సరణి దాటకసత్కార సరణినెంచె॥ ౩౩౧

గీ॥ వాగగోచరమైనట్టు వైభవముచ
కర్ణపేయంబులైనట్టి కల్పనలను
వీణతంత్రుల ప్రేక్ష్యనువింతగాను
పాటపాడించిరింపుగా భవ్యులప్డు॥ ౩౩౨

గీ॥ ఉత్సవాలోక నాయాత ముఖ్యజనము
పట్టణంబంతనిండిన భవ్యగరిమ
జెప్పశక్యంబుగానట్లు చెలగిమిగుల
నిసుకజల్లిన నిలబడగించుకైన॥ ౩౩౩

## నామకరణము.

గీ॥ పుడమి పదిరెండుదినములు బుచ్చినప్పుడు
నామకరణోత్సవము జేసెనామెముగను
రాముడనిబెట్టె జ్యేష్ఠుని రమ్యఫణితి
భరతనాముడు కైకేయి పట్టియయ్యె॥ 334

గీ॥ లక్ష్మణుండును శత్రుఘ్న లలితనామ
లనగనొప్పిరి సౌమిత్రిబార్యసుతులు
చాలయోచించి గురుడిట్లు సరసముగను
నామధేయంబు లొనరించె నవ్యసరణి॥ 335

వ. వశిష్ఠమహర్షి సర్వజ్ఞుడగుట చాల యోచించి యీ నామంబుల నుంచెను. సకలజన మనోభిరాముడగుటను పురుషుల దృష్టిచిత్తములకు కూడ మోహాకరమైన రూపము గలవాడగుటను. జ్యేష్ఠుని రాముడనియు, రామ ప్రవాసకాలమున రాజ్యభార వాహకుడగుట భరతుడనియు, కైంకర్య లక్ష్మీయుక్తుడగుట లక్ష్మణుడనియు, అంతశ్శత్రువులను బాహ్యశత్రువులను జయించువాడగుట శత్రుఘ్నుడనియు నలుగురికి నామధేయముల నొనర్చె,

చ॥ అరయగ దివ్యపాయస సమాష్టమ భాగముచేత బుట్టెనా
భరతుడు కేకయాత్మజకు భక్తుడు రామచతుర్థభాగుడై
పరగెను లక్ష్మణాహ్వయుడు పాయసమందు చతుర్థభాగుడై
వరలె సుమిత్ర గర్భమున వాసిగ రామ సమార్థభాగుడై॥ 336

చ॥ భరతుని భాగతుల్యమగు భాగముచేత సుమిత్రసూనుడై
వరగుణి లక్ష్మణానుజుడు వైరికులాంతకు డుద్భవించెనా
భరతుడు పుష్యమీనముల బాగుగ బుట్టె సుమిత్రి పుత్రులీ
ధరణిని కర్కటోద్భవులు దాంతులు సర్పభజాతులిద్దరున్॥ 337

గీ॥ యనఘుల సుమిత్రగనియె నయ్యజ్ఞచరుల
లక్ష్మణాఖ్యుని శత్రుఘ్ను లలితనాము
ప్రోష్ఠపదకాంతి యుక్తులు పుత్రులంద
రమలగుణ రూప లక్షణు లార్యనుతులు॥ ౨౨౮

వ. అప్పుడు,

సీ॥ దివిజుల దిగులంత దీరెను దివిజారి
గుండెలు దడదడ గొట్టుకొనియె
విమలచిత్తుల మనస్తమము శాంతినిఁబొందె
దుష్టమనంబుల దుఃఖమొదవె
వసుధా చకోరాక్షి వగపులు విగనారె
మునులకు మోదంబు మొలకలెత్తె
గ్రహములు నిజకాంతి కలితులై పరిపూర్ణ
బలముతో గూడిరి భవ్యభముల

గీ॥ సకల జగముల కళ్యాణ సమితి వెలిగె
నెలకు రెండేసి వానలు నేలగురిసె
సాధుజనులకు సంతోష సమయమయ్యె
నంబుజాక్షుండు రాముడై యవతరింప॥ ౨౨౯

వ. ఆసమయంబున,

సీ॥ దివిజుల నర్చించె ద్విజులకు ఘనధాన్య
గోభూహిరణ్యాది కోటులిచ్చె
షడ్రసయుక్తమౌ సరసాన్నముల మెక్కి
"తృప్తాస్మ" యనుచుండె ద్విజులుమిగుల
కామితంబుల నెల్ల కరుణ దేశనకిచ్చె
సకలరాజేంద్రుల సత్కరించె

నింతుల నందఱ నింపుగ పూజించె
బాలుల సంతోషపఱచె మిగుల

గీ॥ ధరణిగలవారి నందఱ దగినరీతి
ధనముచేతను దనిపెను దశరథుండు
వీరువారను భేదంబు విడిచి యన్న
నరణిదాటక సత్కార సమితిచేసె॥ ౩౮౦

వ. అంత బాలుడు,

చ॥ పిడికిట నొక్కపెట్టుకను పెట్టెన రాముడు డిల్లుదాననే
కడువడి భాషలన్నియును గండఁడగుం భయమందకుండుడీ
పిడికిలి జూడుడంచు గను పేర్మిని చెల్వుడి రీతి నింపుగా
పిడికిలిబట్టి యాడు దనుపెద్దలు మెచ్చుచు జూచుచుండగన్॥ ౩౮౧

ఉ॥ నాయన! కన్నతండ్రి రఘునాయక కన్నుల మూయవేమిరా
నాయన! నిద్రవోర తగునా యిది తమ్ములు నిద్రవోవగా
హాయిగ నాటలాడెదవు పంతమ! నీకు సదా వినిద్రతన్
మూయని వేయికంటిదొర ముగ్ధుడ యన్నను నిద్రవోయెడిన్॥ ౩౮౨

గీ॥ సుదతి యొక్కతె రాముని జూచి వేగ
పొత్తిగుడ్డలతో నెత్తి హత్తి చనుల
ముద్దుపెట్టుచు నవ్వించి ముదముతోడ
నింతి కౌసల్య నీ భాగ్య మిసుగొ యనియె॥ ౩౮౩

వ. మరియొకతె,

గీ॥ మంగళము రామరాఘవ మంగళంబు
మంగళము దశరథ సుత మంగళంబు
మంగళము దేవ సంస్తుత మంగళంబు
మంగళము లక్ష్మణాగ్రజ మంగళంబు॥ ౩౮౪

గీ॥ అలవశిష్ఠర్షి రాముని కలయఁగాంచి
దివ్యదృష్టిని గనినట్టి దివ్యమూర్తి
యితఁడె యని యెంచి తన భాగ్య మెట్టిదనుట
కద్భుతంబంది హర్షించె నఖిల విభుఁడు॥ ౩౮౫

క॥ పౌరోహిత్యము జేయుట
సారాచారంబుగాదు సాఫల్యమై నం
శ్రీరాముని సేవింపగ
పౌరోహిత్యంబుజేయ పాల్పడితిని గా॥ ౩౮౬

గీ॥ ఎప్పుడు కమలేశు డీధాత్రి నేలవలచి
పూజ్య మనువంశమందున బుట్టుననుచు
దలపుగలిగెనో యప్పుడె దగనితఁచ్చ
వృత్తినిటు చేయదలచితి బత్తిచేత॥ ౩౮౭

గీ॥ భక్తవరులను సేవించ భక్తిహృదయ
వర్తియగుహరి హర్షించు నాటనుండి
గానభక్తులసారుల కలుషహరుల
సేవజేయుచు గనుగొంటి శ్రీనుతులు॥ ౩౮౮

వ. అని పరమసంతోష సాగర తరంగ డోలికల నూఁగుచున్న చిత్తంబుగలిగి యిహపరభాగ్యంబులన్నియు నీ తేజోమూర్తియేయని దలచి యనవరతావలోకన కుతూహలుండై యుండె. దశరథభూపాలుడును రామసౌందర్య విలోకనమున తృప్తినొందనివాడగుచు నెల్లప్పుడును పుత్రసాన్నిధ్యముననే నివసించి యహంబుల క్షణంబులవలె బుచ్చుచుండె. రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలుగురును చూపరులకానందమును గలిగించుచు దినదినాభివృద్ధినొందుచుండిరి.

సీ॥ శతకోటిబ్రహ్మాండ సందోహములనుండు
సకలలోకంబుల సర్వసురుల

విధిముఖాదుల దైత్యవిభులను మనుజుల
సర్వసత్వంబుల జడచయముల
సూర్యేందు ముఖ్యుల శుభలీలసృష్టించి
రక్షించి ద్రుంచెడి రమ్యమైన
తగనిజంజాటంబు తలదాల్చి యాటల
మఱిగిన దనుజారి మాధవుండు

గీ॥ దశరథాత్మజుడై పుట్టి తల్లి మిగుల
ముద్దులాడగ నవ్వుచు ముఱిపెమునను
యాటపాటల నానంద మధికముగను
గలుగజేసెను గనుగొను కాంతలకును॥ ౩౮౯

వ. అంత క్రమక్రమముగ బాలురు వృద్ధిబొంది యాటపాటల కలరుచు నత్త, తాత, యక్కా, యను నవ్యక్త మధురపదంబుల నుచ్చరించుచు భూమియందు బ్రాకుచు గనుంగొనువారల నానందింప చేయుచుండిరి. అంత యారవ మాసమున యథావిధిగ నన్నప్రాశన మహోత్సవములు జరిపిరి. పిదప వారు తప్పటడుగులిడుచు నడుచుటయు క్రమంబుగ పరుగులిడి యాటలాడుట కారంభించుటయు గలిగెను.

ఉ॥ తమ్ములతోడగూడి తనతల్లులు జూడగ నాటలాడుచో
గ్రమ్మశ్రమాంబు బిందువుల గమ్మని చేలముచేత నొత్తియా
తమ్ముల రేని వంశజుని తద్దయురాముని బ్రాలుద్రావరా
రమ్మని తల్లి బిల్వగను రాముడు లక్ష్మణుజూపు వ్రేలితో॥ ౩౯౦

ఉ॥ తల్లిసుమిత్రలక్ష్మణుని తాంతముడస్సితి బాలుబ్రావరా
యుల్లము చల్లనౌననగ నుత్సుకతం రఘురాముజూపుచుం
తల్లి నిర్వేలుబట్టి పెదతల్లిసమీపము జేర లాగగా
తల్లులునవ్విపుత్రులకు ద్రాగగ స్తన్యము నిత్తురింపుగన్॥ ౩౯౧

ఉ॥ రాముడు బండునుయ్యాలకు రామలులక్ష్మణుడుండు నుయ్యాలన్
ప్రేమనుసోకునట్టులుగ బెట్టినహాయిగ నిద్రబోదు రా
రాములు దూరమందు నుప రాముడు నిద్దురబోదు లక్ష్మణుం
డామహనీయుచేరువర కమ్ముతమై తగు బోరుజెట్టెడిన్॥ 352

గీ॥ అట్లు శత్రుఘ్నుడు భరతుననుసరించు
పాలుద్రావెడి యప్పుడే పరమభక్తి
భరతుడెప్పుడు శ్రీరామభక్తిభరితు
డగ్రజాజ్ఞానువర్తియై యలరుచుండు॥ 353

గీ॥ భ్రాతలందరు సౌభ్రాతృభావమునను
తల్లిదండ్రుల గురువుల దగినరీతి
నుల్లసిల్లగ జేసిరి యుచితభంగి
గనులుగలవార లెల్లరు గనిరి ముదము॥ 354

సీ॥ ఘల్లు ఘల్లుమని మ్రోగియు గజ్జెలందెలు గల
పదకమలంబుల పసుగునిడగ
చంద్రబింబముతోడ సరిపోగు ముఖముల
చిరునవ్వు వెన్నెలల్ చెలగుచుండ
కమలదళంబుల కలకలనవ్వెడి
కమనీయ కనుదోయి కళలనీన
నవరత్నగుంభిత నవ్యముక్తాహార
ములు రొమ్ములను వింత మురువుగూర్ప

గీ॥ తమ్ములును రామచంద్రుడు తల్లులలర
పిల్లలందరతో గూడి వెల్లివిరియు
మొల్లమైనట్టి హర్షాబ్ధిమునిగిమిగుల
నుల్లసిల్లిరి యాటలనుత్సుకతను॥ 355

చ॥ పరిమళయుక్త తైలమున భాసురలీలను తల్లిమెల్లగా
శిరమున దేహమందునను చేతులనంటి జలంబుబోసి వే
వెరవగు ధూపసంగతిని వెంట్రుకలార్చియు వేణియల్లియున్
పరువగుసొమ్ము వెట్టియును పంపు నలంకృతవేదునాడగన్॥ ౩౫౬

సీ॥ పరమ మునీంద్రులు పరతత్త్వమనియెంచి
తనుమానసంబుల దవిలికొలువ
రాజులు తనుజూచి రాజనీతియె యిట్లు
గలుగబోలు నటంచు దలచుచుండ
తల్లులు తండ్రియు దమ పూర్వభాగ్యంబె
తనయుడయ్యె నటంచు దలచుచుండ
ప్రజలెల్లరును జూచి ప్రభవించె మనువని
తమతమ మనముల దలచుచుండ

గీ॥ మగువ లందరు మనమును మదనుడనగ
లక్షణజ్ఞులు లక్షణ లలితుడనగ
గనులకానంద మొనరింప గలిగినట్టి
చంద్ర సంకాశుడగు రామచంద్రుడలరె॥ ౩౫౭

గీ॥ అయ్య! రామయ్య! రావయ్య! యనుచు తల్లి
పట్టుకొనరాగ దొరకక పరుగులిడుచు
తల్లి యలసిన దరిజేరి తమ్ములకును
తల్లులను జూపు వ్రేలితో తల్లులలర॥ ౩౫౮

గీ॥ సకలకళ్యాణ గుణగణ సహితుడైన
రామచంద్రుని చంద్రునిరాక నిశిని
గనులు గలవారు గన్నుల గాంచిమదిసి
సమ రసంబైన ప్రీతిని జాలగనిరి॥ ౩౫౯

వ. విద్యాభ్యాసమునకు తగినవయోవిశేషమంకురించుటతోడనే దశరథరాజేంద్రుఁడు వశిష్ఠానుమతంబున తగిన గురువుల సన్నిధానమున విద్యలనెల్ల జదివించెను. బాలురు నలువురు సకలవిద్యల యందునను శస్త్రాస్త్రవిద్యలయందును హయారోహణ, గజారోహణాదుల యందును, మల్లవిద్యా విశేషంబులను, యసదృశ శక్తిసంపన్నులై తమగురువుల కానందంబు గలిగించుచుండిరని కుశలవులు వినిపించిరి.

క॥ మందార మాలికాధర
సుందాసుర తనయకాల సురముని వినుతా
బృందారక సంసేవిత
వందారు జనేష్టదాన వాసవవృజా॥ ౩౬౧

క॥ విశ్వేశ్వర విశ్వాత్మక
విశ్వోదర విశ్వవినుత విశ్వాధారా
విశ్వగత విశ్వరూపక
విశ్వాతిగ విశ్వసర్గ విలయస్థేమా॥ ౩౬౨

పంచచామరము. సరోజపత్ర నేత్రరాక్షసాళి మానఖండనా
పరాత్పరా మహానుభావ భానువంశశేఖరా
విరోధి మత్తదంతి సింహ వీరలోక సన్నుతా
పరాకులేక నన్ను గావు భానుపుత్ర వందితా॥ ౩౬౩

మాలినీవృత్తము. శమిత దనుజలోకా శాసితానేకధర్మా
కమల సదృశనేత్రా కామ సంకాశదేహా
నమిత సకలభూపా నవ్యదివ్యాపనామా
శమదమ గుణభూషా శాంతపాపప్రసేవ్యా॥ ౩౬౪

శా॥ లోకాతీత గుణాభిరాముడు రమాలోలుండు రామప్రభుం
డీకళ్యాణ కృతీశ్వరుం డజముఖాభీష్టార్థదుం డాఢ్యుడున్
శ్రీకళ్యాణ సుఖంబు లిచ్చి మనుచుం జేతోముదంబొప్పగా
నీకావ్యంబు రవీందు తారకలతో నింపొందు భద్రంబుగన్॥ ౨౬౮

మ॥ ఇదిరామానుజ యోగిరాజ కథితాభీష్టార్థ తత్త్వజ్ఞతా
పదవిభ్రాజితు యజ్ఞమూర్తిని మది న్భావించి స్వీయాన్వయు
న్ముదమొప్పారగ రాముతమ్ముని కథ న్మోచాఫలాభంబుగా
సదయుల్మెచ్చ వచించితి న్మొదటిదా మాశ్వాసంబు రామ ప్రభో॥

గద్య

ఇది శ్రీమద్భగవద్రామానుజ కరుణాకటాక్ష పాత్ర యజ్ఞార్య పవిత్రవంశ్య
చతుస్సప్తతి పీఠాంతర్గత తనీయపీఠాధిష్ఠిత భారద్వాజస గోత్ర
పవిత్ర తిరుమలై యచ్చార్ కాండూరు రాఘవాచార్య
దేశిక వేంకటాంబా పుత్ర విబుధజనవినయ చర్య
వేంకట తిరుమలాచార్య ప్రణీతంబగు
భరత చరిత్రంబను మహాప్రబంధము
నందు ప్రథమాశ్వాసము
సంపూర్ణము. శుభం
భూయాత్ ॥
శ్రీ శ్రీ శ్రీ



# ప్రథమాశ్వాసమునకు ధనప్రదులు.



మ॥ రా॥ శ్రీ 1. రావుసాహెబు కోట్ల సన్యాసయ్యనాయుడుగారు దుమ్మగూడెం.

,, 2. సోమరాజు పురుషోత్తమదాసుగారు

,, 3. వోరుపుల అప్పలస్వామిగారు

,, 4. చెలికాని రంగయ్యారావుగారు యడవల్లి మొఖాసా.

,, 5. వల్లూరి లక్ష్మయ్యగారు

,, 6. గూడూరు మల్లిఖార్జునుడుగారు వంగూరు.

,, 7. పూళ్ళ శేషగిరిరావుగారు

,, 8. మొగళ్ల సుబ్బారావుగారు

,, 9. కొత్త పెరుమాళ్లయ్యగారు అంకనగూడెం.

,, 10. యీ రామయ్యగారు

,, 11. యీ వెంకటరంగయ్యగారు

,, 12. ముప్పాళ రంగయ్యగారు

,, 13. మామిళ్లపల్లి సుబ్బయ్యగారు

,, 14. వాడపల్లి భీమయ్యగారు

,, 15. మొరవినేని వెంకటనరసయ్యగారు

,, 16. యీ వెంకటప్పయ్యగారు

,, 17. యీ వెంకమ్మగారు

,, 18. యీ వెంకటాద్రియ్యగారు కొత్తపూరు.

,, 19. యీ సూరయ్యగారు

,, 20. యీ గోవిందయ్యగారు.

,, 21. యీ సుబ్బయ్యగారు

,, 22. యీ జగ్గమ్మగారు

,, 23. పెనుమాక లక్ష్మీనారాయణరావుగారు,
కూచంపూడి.

,, 24. వీరప్రతాప కూర్మరాజుగారు తాలూకాదారు
రాఘునాపురం.

,, 25. జూపల్లె ధర్మలింగయ్యగారు అశ్వారావుపేట.
,, 26. యీ సీతారామారావుగారు
,, 27. యీ దాసయ్యగారు పొట్టినారిగూడెం.
,, 28. చెలికాని సూర్యారావుగారు
,, 29. ఆత్మకూరి నాగరత్నంగారు నాగులవంచ.
,, 30. యీ కృష్ణయ్యగారు
,, 31. యీ నాగయ్యగారు
,, 32. యీ సీతయ్యగారు
,, 33. యీ చినకృష్ణయ్యగారు
,, 34 తేలుకుంట కృష్ణయ్యగారు
,, 35. యీ జగన్నాథంగారు
,, 36. చల్లా శేషయ్యగారు
,, 37. రాయపురి వెంకయ్యగారు
,, 38. యిమ్మడిశెట్టి కృష్ణయ్యగారు
,, 39. యీ పిచ్చయ్యగారు
,, 40. తేలుకుంట నారాయణగారు బొగ్గుగుంట.
,, 41. మాజేటి వరదయ్యగారు దొండపాడు.
,, 42. యన్నాకుల ఆంజనేయులుగారు జగ్గయ్యపేట.
,, 43. గోరుగుంట్ల మహాలచ్చయ్య బ్రదర్సువారు లింగ

,, 23. పెరుమాళ్ల లక్ష్మీనారాయణరావుగారు,
కూచంపూడి.

,, 24. వీరప్రతాప కూర్మరాజుగారు తాలూకాదారు
రాఘునాపురం.

,, 25. జూపల్లె ధర్మలింగయ్యగారు అశ్వారావుపేట.

,, 26. యీ సీతారామారావుగారు

,, 27. యీ దాసయ్యగారు పొట్టినారిగూడెం.

,, 28. చెలికాని సూర్యారావుగారు

,, 29. ఆత్మకూరి నాగరత్నంగారు నాగులవంచ.

,, 30. యీ కృష్ణయ్యగారు

,, 31. యీ నాగయ్యగారు

,, 32. యీ సీతయ్యగారు

,, 33. యీ చినకృష్ణయ్యగారు

,, 34 తేలుకుంట కృష్ణయ్యగారు

,, 35. యీ జగన్నాథంగారు

,, 36. చల్లా శేషయ్యగారు

,, 37. రాయపురి వెంకయ్యగారు

,, 38. యిమ్మడిశెట్టి కృష్ణయ్యగారు

,, 39. యీ పిచ్చయ్యగారు

,, 40. తేలుకుంట నారాయణగారు బొగ్గుగుంట.

,, 41. మాజేటి వరదయ్యగారు దొండపాడు.

,, 42. యన్నాకుల ఆంజనేయులుగారు జగ్గయ్యపేట.

,, 43. గోరుగుంట్ల మహాలచ్చయ్య బ్రదర్సువారు లింగా